శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.






# ముక్తపదగ్రస్తమురహార మా...

ఇయ్యది

వీరాణత్తూరు ఎలిమెంటరీ స్కూల్ మాస్టర్.

తుర్లపాటి. గురుసామయ్యగారిచే, రచింపఁబడి.

చిత్తూరు గవర్నమెంటు హైస్కూల్ తెలుగుపండితులగు,

జి. శ్రీరామశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడి.

పాలిపాలదుర్గ్వారి. వీరాస్వామిరెడ్డి, వెంకటసుబ్బారెడ్డి గార్ల

ద్రవ్యసహాయమువలన.

చిత్తూరు శ్రీశారదా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

ప్రతి వెల 1920 రూ. 0—0—9

శ్రీరస్తు.

## పాఠకమహాశయుల కొక విజ్ఞప్తి.

అయ్యా!

శ్రీమద్ఘటికాచలక్షేత్ర నికటస్థంబై శ్రీ వేణుగోపా
దేవపాలితంబై వీరాణాత్పూరియను పేరంబరగు నగరంబు
నంగ్గల శ్రీ సరస్వతీనిలయ పాఠశాలోపాధ్యాయుండ
నగు నేను శ్రీ రామచంద్ర సాంద్రదయాపీయూషాతిశయ
శక్తిచే, భక్తిరసప్రపూరితంబును, భుక్తిముక్తి ప్రదాయ
కంబునునగు నిముక్తపదగ్రస్తమురహర ముక్తావళియను
పొత్తంబును విరచించి, ధనికుండఁగామినియ్యది ముద్రిం
పంబడు టెట్లో కోయని సాధ్వసావేశస్వాంతుండనై తద్యత్న
విరతుండనై యుండ నేతన్నగరనాస్తవ్యులును, సజ్జన
స్తవ్యులును భగవద్భక్తియుక్తులును దేహాశూరవంశోద్భ
తులును పోలిపాలదువ్వూరి నామకగోత్ర సంజాతులును,
వెంకట్రెడ్డిపర్యతనయులును వీరాసామిరెడ్డి వెంకటసుబ్బా
రెడ్డినామధేయాంకితులునగు నీసోదరులు నాగ్రంథము
నామూలాగ్రంబుగ నాలించి, యియ్యదిలోకోపకారార్థ
మని యోజించి, ముద్రణామూల్యద్రవ్యంబు నిచ్చి, నన్ను
ఫలీకృతోద్యమునింగావించిన వీరియెడల సర్వదాకృత

జుండనై పీరినిసాకేతపురి సార్వభౌముండగు రాముండెల్ల ప్పుడు సమగ్రానుగ్రహంబున దీర్ఘాయురారోగ్య భోగ భాగ్యాదులందయచేసి రక్షించుంగాతమని ప్రార్థించు చున్నాండను.

సీ॥ శ్రీ వేణుగోపాలు। నావాసమైయొప్పు
పీరణత్పురియందు। వెలయు దేహ।
శూరాన్వయంబందుం। బేరొందుపోలిపాల్
దువ్వూరిగోత్రమం। దునజనించె।
గాణేయగుణుండు వెం। కట్రెడ్డినాముండా
తండుసంజీవాంబం బెండిలియయి।
కనెనువీరాసామి। యనుసుతు వెంకట।
సుబ్బాఖ్యసూనుల। సుగుణమణుల।
ఆ॥ వె॥ పీరికఖిలశుభము। లారమాధిపుండిచ్చి।
మనుపసతులుసుతులు। మనుమలధిక।
భాగ్యభోగములును। బాడియుంబంటలుం।
గలిగివిశదయశము। గాంత్రుగాక॥

శ్రీరామజయం.



# ముక్తపదగ్రస్త మురహార ముక్తావళి.

శీమద్భానుకులంబునందుదయమై • శ్రీరామనామంబుతో
క్షేమోత్కర్షతనీశువిల్లుద్నిమిసా • ధ్వీరత్నమాజానకీ। [ల
రామక్ బెండిలియై యయోధ్యనుమహా • రాజ్యాదిభోగంబు
ల్యామోదంబునఁగాంచినట్టిరఘురా • మానన్నుఁ బాలింపు

❧ తోడిరాగము, అటతాళము. ❧ [మా॥

1. శ్రీమనోహరరామసోదర • శ్రీకరాకరుణాకరా।
వామలూరుజమానివందిత • వర మొసంగరమురహరా॥

2. వరమొసంగెడు వేల్పు వీవని • శరణుఁ జొచ్చితిఁ బ్రోవరా ।
తరుణమిదె నను మఱువఁ బోకుము • దనుజమర్దన మురహరా ॥
3. దనుజనాయకుఁడైన రావణుఁ • దలలఁ ద్రుంచితి వాజిలో ।
మనుజరూపం బెత్తి రామా • ఖ్యను భువిన్ను మురహరా ॥
4. మునుల మానస కమలములు నీ • కునికిపట్టులుగా వెయో ।
వనజభవనుత ఘననిభాంగా • కనకచేలా మురహరా ॥
5. కనకకశిపుని మనుమన్నృహరివై • కంబమున జన్మించియా ।
తని నఖంబులఁ జీల్చి కృపణుఁ • దనయు మనిచితి మురహరా ॥
6. తనయుఁ డెమ్మని గురుఁడు గోరఁగఁ • దక్షిణామసంయమనికిఁ
జనికుమారునిఁ దెచ్చి సాందీ • పనికి నొసఁగవె మురహరా ॥
7. పనికిమాలిన తనువు సతమని • బ్రమసి సంసారాంబుధిఁ ।
మునిఁగి మూఢులు నిన్నుఁ గొలువక • మోసపోదురు
మురహరా ॥
8. మోసమునఁ బాండవుల భాగ • మ్మును గ్రహించి
సుయోధనుం
డే సుఖంబును గనక తానే • నాశ మొందఁడె మురహరా ॥
9. నాశరహితుఁడవయిన నీపద • నలినభక్తి నొసంగవే ।
కేశవా సర్వేశ వామన • కృష్ణ శార్ఙ్గి మురహరా ॥

10. కృష్ణకృష్ణాయేలుమనిసభఁ•గేలుమొగిచినుతింపఁగా।
కృష్ణపత్నికనేకపటముల•నిచ్చితివిగదమురహరా॥
11 ఇచ్చితివియొకపిడికెడటుకులఁ•దెచ్చియొసఁగినబాపనిన్
మెచ్చియర్చలొనర్చిసంపద•లెచ్చుగానునుమురహరా॥
12. ఎచ్చులొచ్చులులేకజీవుల•నెల్లసమముగఁజూచుచున్।
దుచ్ఛగుణములఁబాయమోక్షము•దొరకునతనికి
మురహరా॥
13. వారలసేవలఁజేసికాలము•జరుపుటేలొకొపామరుల్।
వరదుఁడగునినుఁగొల్చిముక్తినిఁ•బడయరాదేమురహరా॥
14. పడయరానిసుఖంబులున్నవె•భక్తకోటికినీయెడన్।
గడుపుకూటికినరులఁగొల్చుట•గాసియేగదమురహరా॥
15. గాసికోర్చితపంబుసేసినఁ•గానిముక్తిలభించునే।
వేషభాషలనేర్చినంతనె•యాసలుడుగునెమురహరా॥
16. ఆసనంబులవేసిముద్రల•నభ్యసించినమాత్రనే।
ఆశయంబునుగెలిచికైవ•ల్యంబునందునెమురహరా॥
17. అంబుజాస్యలఁగనినదేమద•నార్తిఁగుందెడుకుత్సితుల్
దంభయుతులైతత్త్వముపదే•శంబుఁజేతురుమురహరా॥
18. చేతులారఁగనీదుపూజలఁ•జేయఁజాలనివానికా।
చేతులేటికిఁగాళ్ళనేనర•సింహరూపామురహరా॥

19. సింహదర్శనమైనయమపురిఁ♦జేరుగజములపోలికఁ।
సంహృతంబగుఁగలుషములునిను-సన్నుతించినమురహరా
20. సన్నుతించెదనిన్నుశ్రీధర♦సర్వభూతమయేశ్వరా।
నన్నుమన్ననఁజేసిగావర♦నందనందనమురహరా॥
21. నందనందనగావుమనికరి♦నక్రపీడసహింపకా।
క్రందమొనరుపమకరిఁజంపియుఁ♦గరినిఁగాచితిమురహరా॥
22. కాచితివిమునునందగోపుని♦కనఃపులనుబృందావనిఁ।
దోఁచితివిహాల్వెన్నలనుగడుఁ♦దుంటతనమునమురహరా॥
23. తుంటవిల్తునిబారికోర్వక♦తోయజాక్షులువలచినీ।
జంటఁజేరఁగవారికినిరతి♦సౌఖ్యమొసఁగితిమురహరా॥
24. ఒసఁగితివిశిశుపాలునకుసా♦యుజ్యపదవిసభాస్థలిఁ।
గసరినిన్నుటుతిట్టియతఁడెటు♦గాంచెసద్గతిమురహరా॥
25. సద్గతిందయసేయవేయని♦స్వాదుఫలములొసంగినిఁ
గద్గదోక్తినుతించుశబరిని♦గారవించితిమురహరా॥
26. గారవించినరాజధర్మునిఁ♦గాల్చిచంపఁడెగౌతముం।
డారయఁగమేల్మఱచువాఁడప-హారమొనరుచుమురహరా
27. హారకునిహృదయంబుసాంద్రద♦యాయుతంబై
యుండునే।
దారుణంబయియొప్పఁగాకగ♦దాగ్రజాహరిమురహరా॥

28. అగ్రజాతినిఁ బుట్టినంత నె • యాత్మతత్త్వము నెఱుఁగఁగలఁడె।
అగ్రమగు బ్రహ్మంబు నెఱుఁగక • యధికుఁడౌనే మురహరా॥
29. అధికమగు సురతానుభవమున • నాయువును
గోల్పోవఁగా।
పృథివియందు విచిత్రవీర్యుఁడు • పిన్ననాఁడే మురహరా।
30. పిన్ననాఁడలవడని గుణమది • పెద్ద పెరిఁగినఁ గలుగునే।
చిన్న మొలకను వంపకున్నను • జెట్టు వంగునె మురహరా॥
31. చెట్టు చుట్టును దిరిగినంత నె • చెలులు గర్భిణులై భువిఁ
చిట్టిపాపలఁ గందురే సీ • సేవసేయక మురహరా॥
32. సేవకుండగు పవనజుండా • సీత సంగతిఁ దెలుపఁగా।
నీవె నాకనుజుండవంటివి • దేవదేవా మురహరా॥
33. దేవదానవకోటి యుదధిమ • థింపఁగాఁ దా మేలవై।
గ్రావమబ్ధిమునుంగనీయక • లేవనెత్తితి మురహరా॥
34. లేవనెత్తితి ధేనువర్ధన • గ్రావమొక్కకరంబునన్।
గోవులను గోపకులు వానకు • గోలసేయఁగ మురహరా॥
35 గోలతో గోపికలు యమునా • కూలమందిడి వలువలన్।
ఓలలాడెడు వారి వల్వల • నోగిహరించితి మురహరా॥ [యా
36. హరిణరూపముతోడ రక్కసుఁ • డరుగుదేరఁగఁ గాంచి
ధరణిజాసతి వేఁడ లేడిని • దఱిమి జంపితి మురహరా॥

37. తలుమునుండెడుఁగాలయవనుని • మొఱఁగి బిలమును దూఱియా
కలకరిన్ముచికుందుకనిచేఁ • గాలఁజేసితిమురహరా॥
38. కాలకంఠుని చేతివిల్లవ • లీలఁద్రుంచి పతివ్రతా।
శీలయౌభూసుతను బెండిలిఁ • జేసికొంటివిమురహరా॥
39. చేసితివి గదరాయబారముఁ • జేసితివి సారథ్యముఁ।
జేసితివి తత్త్వోపదేశముఁ • జెలఁగినరునకుమురహరా॥
40. నరునిదండకునరిగిభయమున • శరణుఁజొచ్చినగయునికై
కరుణలేక యెనరునితోడను • దురమొనర్చితిమురహరా॥
41. దురమునను గాంగేయుశరములు • దూఱినీమెయిఁజింపగా
సురనదీసుతుశిరమునఱుకఁగఁ • బరువువాఱితిమురహరా॥
42. వారిజాక్షముకుంద కైటభ • వైరిగోకులపాలకా।
నారదాదిమహర్షి వందిత • మారజనకామురహరా॥
43. జనకునానతిసలుపనడవికి • జానకీసౌమిత్రితోఁ।
జనిచతుర్దశహాయనంబులు • శ్రమములొందితిమురహరా॥
44. శ్రమములుడుగునునిన్నుఁగొల్చిన • సాధుపుంగవ కోటికిన్
యమభయంబువోలంగుసకలసు • ఖానుభవమగు మురహరా।

45. అనుభవింపక తీఱంజాలని, యఘసమూహము
లన్నియుఁగ।
మనసునీపయినిలుపనరుగక, మరలనిలుచు నెమురహరా
46. మరలజన్మము లేనిపదవిని, మాధవా దయసేయవే॥
గరుడగమనా సేవకుని నను, గష్టపెట్టక మురహరా॥
47. కష్టమని కృషిసలుపమానిన, గార్యసిద్ధిని గాంచునే॥
శిష్టరక్షణ దుష్టశిక్షణ, శేషశయనా మురహరా॥
48. శేషగిరి నివసించి భక్తుల, చేతముడుపుల నంది సం!
తోషివై కామితములొసంగెదు, దొడ్డవేల్పవు మురహరా॥
49. దొడ్డవేలుపవైన నీవే, వడ్డికాసుల విభుడవే।
చెడ్డగుణులగునరుల విడుతురె, శ్రీనివాసా మురహరా॥
50. వాసవార్చితవీరణాత్పర, వాసగోపకుమారకా।
దాశరథిగురుసామికవివర, పోషకా శ్రీమురహరా॥ శ్రీ॥

ముక్తపదగ్రస్తమురహరముక్తావళి,

సంపూర్ణము.

-----

S. S. Press, Chittoor.